Regd No. N44
M. 3816

విడిప్రతిక ౦-౧-౨

To Let

# గోలకొండ పత్రిక

ప్రతి సోమ ; గురు వారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౮ ● హైదరాబాదు దక్కను ఫా. శ. ౧౩౫౩ స్వభాను మార్గశిర బ. ౮ [౧౬-౩-౧౩౫౩ఫ] సోమవారము ● సంచిక ౬౨



## ఆస్సాం విమానాశ్రయంపై జపాను విమానాలదాడి

### బర్మాలో అమెరికను విమానాల చర్యలకు ప్రతిక్రియలా?

ఈ డిసంబరు౧౮,౧౫,౧౬ తేదులలో ప్రకటితములైన యుద్ధవార్తల నిక్కడ సింహావలోకనము చేసెదము.

ఇండియా

ఇండియాలో డిసంబరు ౫వ తేదినాడు కలకత్తానగరము పైకిజపానీయ విమానాలు పోయి బాంబులను వేయుటవల్ల ఆనగరమందు మొత్తము ౩౩౫మంది మరణించినట్లు డిసంబరు౧౫వ తేదివరకు కలకత్తా పురపాలక సంఘమువారి ఉద్యోగము ౦ తయారుచేసిన లెక్కలవల్ల తెలినది.

డిసంబరు ౧౩వ తేదిన జపానీయ విమానములు ఆస్సాం రాష్ట్రమందు ఈశాన్యభాగమున అమెరికనుల విమానముల మూలసంస్థానము పైబాంబులను వేసినవి.ఇందువల్ల నష్టముచాల తక్కువ,జరుగలకు తగిలిన దెబ్బలును తక్కువ.అట్లువచ్చిన జపానీయ విమానాలనుండి ౧౮క్రిందికి కూల్చి వేయబడినవి

బర్మా

బర్మాలో బ్రిటిషువారి యొక్కయు, జపానీయుల యొక్కయు పెట్రోలుసేనల సంఘర్షణలు డిసంబరు ౧౫వ తేదికి పూర్వపు వారములో చాల చురుకుగానుండెను.

ఆదే వారమందు బ్రిటిషువారి యొక్కయు, అమెరికా వారియొక్కయు విమానములు బర్మాలోజపానీయ సేనలఆక్రమణలోనుండు ప్రదేశముల పై తీవ్రములైన దాడులను చేసినవి వీటికి ప్రతిక్రియగానే ఆయియుండవచ్చును జపానీయ విమానాలు

ఇటీవల ఇండియాలో ఆస్సాం, కలకత్తాలపై జరిపిన దాడులు,

చైనా

చైనాలో హాంకాంలో విమానాశ్రయముపై డిసంబరు ౧౧వ ౧౨వ తేదులలో అమెరికనులవిమానములు దెబ్బలను వేసినవి ౧౨వ తేది పగలుఇండోచైనాపై దాడిచేసినవి.

జపానీయుల విమానాలు ౧౨వ తేదిన తూర్పు చైనాలో అమెరికనుల ఒకవిమాన స్థానముపై బాంబులను వేసినవి.

పసిఫిక్ ప్రదేశము

పసిఫిక్ ప్రదేశమందు ఆస్ట్రేలియా దిక్కున న్యూగినీలో హువన్ద్వీపకల్పమందు జపానీయ సేనను ఆస్ట్రేలియనులు ఉత్తరమునకు తరిమి వేయుచున్నారు. జపానీయ సేనలు సేనలుగా నిలచిపోరాడుట సన్నగిల్లినది.అక్కడ దక్కడకొందరు కొందరుజపానీయ సైనికులు చేరియుండి ఆస్ట్రేలియావారి సేనలును ప్రతిఘటనచేయుట మాత్రము జరుగుచున్నది.

డిసంబరు ౧౫వ తేదిన అమెరికనునౌకలు అరావేలో అమెరికనుల సేనలను దాపినవి.

అమెరికనులనౌకలలో ఒకసేనజపాను వారి వగుకారొలీను దీవులలో మధ్యనసుండి, గొప్ప నౌకాశ్రయముగల ట్రక్ దీవిసమీపముగా పోయినవి.కానివాటి నెదుర్కొనుటకుజపానీయులయుద్ధ నౌకలు కనిపించలేదు.

అమెరికనుల నౌకలనుండి విమానములు జపానీయులవియగు నాలుగు విమానాశ్రయముల పై దెబ్బలను వేసినవి. మరియు ఈనౌకలవల్ల రెండు శత్రుయుద్ధనౌకలు సముద్రములో ముంచి వేయబడినవి, మరిగ౨ శత్రునౌకలు పాడైనవి ౮౨జపానీయ విమానములు క్రిందికికూల్చివేయబడినవి. నేలమీదవిమానాశ్రయములలో నుండు౬౭ విమానములు నాశనముచేయబడినవి.

జర్మనీ, ఆస్ట్రియాలపై విమానాలదాడులు

డిసంబరు ౧౩వ౧౫వ తేదులలో బ్రిటిషు విమానాలుజర్మనీ పడమటి భాగము మీదదాడులను చేసినవి.౧౬వ తేదినబర్లిను నగరముపైని బాంబులను వేసినవి.

డిసంబరు ౧౫వ తేదిన బ్రిటిషు విమానములు ఇటలీనుండి జర్మనీదక్షిణ భాగమునకు పోవుపెద్ద బాటపైనుండు గొప్పరైలుబాటల కేంద్రమున్ను, ఆస్ట్రియాలోని టిరాల్ రాష్ట్రము యొక్క ప్రధాన నగరమున్ను అగుఇన్సుబ్రక్ మీదగొప్ప దాడినిచేసి ఆనగరమందలి హాంజినీలకు పరిశ్రమలు,వస్త్రపరిశ్రమలు, నగరసమీపమున నుండువిమానాశ్రయము, జలవిద్యుచ్ఛక్తియంత్రములు మున్నగు వాటికిని, ఆపెద్దబాటపైనుండు రైల్వేలసంబంధములైనవాటికిని చాలనష్టములను కలిగించినవి.

—

## దేశంలో రాజకీయాం దోళన చర్యలు

—

మదరాసు, డిసంబరు ౧౬

డిసంబరు ౩వ తేదిన పోలీసు కమీషనరుయొక్క ఆజ్ఞకు వ్యతిరేకముగా ట్రిప్లికేను సముద్రతీరమున సభను జరిపినందుకు శ్రీమతిఅంజలాయ్ అమ్మాల్ మున్నగు ఆర్గురుస్త్రీలకు మూడవరాజధాని మేజస్ట్రేటు శైనుశిక్షలను విధించినారు శిక్షల్లేమరిరవాసుదిక్షిని విధించినారు. (అ. ప్రె.)

సూరత్, డిసంబరు౧౬:— బ్రోచ్‌లో ఆర్. యస్. దళాల్ హైస్కూలులో ఒకక్లాసుగదిలో ప్రేలనిబాంబొకటి కనిపించినట్లును, దానిని పోలీసులు పట్టుకొనిపోయినట్లును బ్రోచ్‌లో ఒక పత్రికయందు ప్రకటితమైనది.

—



## చతుర్భుజావతారము

—

కాశీ డిసంబరు ౬ మంగళవారమునాడు రాంపూరులో ఒక యువతికి చతుర్భుజములును, ద్విశిరము, తక్కినదేహమంతయు సాధారణముగ నున్నయొకు ఒకశిశువుజన్మించెను ఆశిశువు కొద్దిసేపుమాత్రమే బ్రతికెను. ఈచిత్రము చూచుటకై అనేకులు రాంపూరుకుపోయిరి.

—

## మహాసభ ఆగినది

—

(స్వావి.) రంగంపేట ౧౩-౩-౫౩

ఈ ౧౬బహమన్ తేదిన మెదకుజిల్లాయందలి, రంగంపేటలో, ఆంధ్రోద్యమప్రబోధక బహిరంగ సభ జరుపదలచి, నెలరోజులకుముందుగనే, మండలాధికారిసన్నిధికి, దేఖారముపైబిజ్ఞప్తి పంపబడెను. కాని ఇంతవరకు అనుమతిలభించనందున, సభ ఆగిపోయినది.

—

## ౧౧వ ఆంధ్రమహాసభ

—

ఈసారి (౧౧,వ ఆంధ్రమహాసభ మాజిల్లాలో జరుగుటకు స్థాయిసంఘమువారి అనుమతితో ఆహ్వానసంఘము ఏర్పడినది. ఆహ్వానసంఘమువారు విరాళములను ప్రోగుచేయుటకు సంసిద్ధులగుచున్నారు. గతరెండుసంవత్సరములనుండి ఆంధ్రమహాసభలో అంతర్భాగముగా ఏర్పడియున్న కాంగ్రెసు జాతీయపక్షములవారు ఎన్నికలలో తమ తమబలాధిక్యతను సంపాదించుకొనుటకు తమతమ కత్తులను వరలలోనుంచి పైకితీసి నూరినారు. పార్టీటెక్కెట్టుప్రకారము ఎన్నికలకు సంబంధించిన పనులలో నిమగ్నులైనారు. ఈఎన్నికలహడావిడి దాదాపు (౮) నెలలవరకుంటుంది.

సాధారణ పరిస్థితులలో ఎన్నికలహడావిడి కూడ ఉద్యమప్రచారమునకు, వివిధతత్వాలప్రబోధమునకు ఉపకరించును. కాని మన మిపుడు అసాధారణ పరిస్థితులలో నున్నాము. ఇటీవల ప్రభుత్వమువారు అవలంబించిన వివిధకంట్రోలు విధానములను చూచిన, రాష్ట్రములోని ప్రతి పౌరుడు, తనజీవితము, అలవాటులు మొత్తము సాంఘికవిధానముననే మార్చుకోక తప్పదు. పరిమితిగా సంచరించుకోవలసివచ్చును. మొదటితీరుగ విందు, భోజనసత్రాలు, సంతర్పణలు పెట్టుటకు అవకాశములేదు. తిండిధాన్యమునుండి గ్యాసు నూనెవరకు కంట్రోలువచ్చిన దున పరిస్థితియందు లోకూడ ఇబ్బందిగనే యున్నది.

ఆంధ్రమహాసభకు కలిసికట్టుగా, మహాసభకు వచ్చేప్రతినిధులు ప్రేక్షకులసంఖ్య మనకు తెలియునిది కాదు, మహాసభ జరుగుటకు ఎంతోహడావిడి కావలసియుంటుంది పదిపది వేలమందిజనములకు భోజనవసతులు నల్లాలు, మహాసభకై మంటప నిర్మాణము, విద్యుద్దీప ములు మున్నగువాటికై ఈ రోజులలో ఏర్పాట్లు ఏవిధముగ కాగలుగును? వీటన్నిటికై స్థానికులనువేధించి కృత్యాద్యవస్థతో ఏర్పాట్లుచేయించి మహాసభజరిపి ఏమి సాధించేది యున్నదాయను విషయము ఆలోచించవలెను, తయ్యారైనులెల్ల ఈ సారిమహాసభనుఆపి కార్యకర్తలంతా, అన్నిపక్షాలవారు, ప్రస్తుతము దేశీయులకు ఏర్పడుచున్న యిబ్బందులనివారణకు యోగ్యమైన కార్యక్రమమును తీసికొనవలసిన చేయుట ఉచితమని తోచుచున్నది. మహాసభ నాయకులు, విజ్ఞులు, ఈవిషయమును ఆలోచించవలెనని కోరుచున్నాను.

మెదకుజిల్లా ఆంధ్రుడు.

—

## సీతారాంబాగ్ కళాశాల

—

హైదరాబాదు సీతారాంబాగుసంస్కృతకళాశాలను ౧౨డిసెంబరునాడు ప్రయాగవిద్యాపీఠకుల పతులైన డాక్టర్ అమరనథఝాగారు దర్శించిరి. శ్రీ యస్ శే. రావుగారున్నూ శ్రీ లక్ష్మీనిరాసగనేరీవాలు గారున్నూ తదితరులున్నూ వారికిస్వాగతమిచ్చిరి. డాక్టరు అమరనాథగారు కళాశాలలోని ప్రన్సివాలుగారును ఇతరోపాధ్యాయులును వేదాంత మీమాంసవ్యాకరణముల పాఠములను విద్యార్థులకు సంస్కృతమందే అధ్యాపనము చేయించుటను శ్రద్ధతోవిని ఆశ్చర్యచకితులైరి. తర్వాత వారికి పాఠశాలా కార్యనిర్వాహక వర్గము వారు మంటపములో స్వాగతమిచ్చిరి. ఉపాధ్యాయులలొకరు ఒకవిద్యార్థియు అనువుగారచించిన డాక్టరుగారిప్రశంసాశ్లోకములనుచదివిరి. తర్వాత ప్రతాపరెడ్డిగారు పాఠశాలలోని ప్రతిఫలరహిత విద్యాభోజనవసతులను గూర్చి తెలుపుచు దాని వృద్ధిని వివరించిరి. శ్రీ డాక్టరు అమరనాథగారు కొన్నివాక్యాలు సంస్కృతములో మాట్లాడిన తర్వాత హిందీలో ప్రత్యుత్తరమిచ్చుచు ఈరాష్ట్రములో ఇంతటియుత్తమసంస్కృత విద్యావిధానమున్నందులకు తనకు చాలా ఆశ్చర్యముకలిగినదనియు బోధ ఉత్తమస్థాయిలోనున్నదనియు, హైదరాబాదు ప్రభుత్వమువారు దీనికి ఉదారముగా ద్రవ్యసహాయము చేయవలెననియు, తాను నిజముగా మదాహనంద భరితుడనైతిననియు తెలిపిరి. సభానంతరము శ్రీ వారికి ఫలపుష్పతాంబూలములను సమర్పించిగౌరవించిరి.

—

# ఇండియాలో అల్లరులకై రూ౯౦ లక్షల జుర్మానా

## బ్రిటిషు పార్లమెంటులో అమెరీగారి వివరణ

బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభయందు డిసంబరు ౧౦ తేదిన సోరెన్సన్‌గారు ఒక ప్రశ్నలో గడచిన ౧౫ నెలలలో ఇండియాలో ఎన్నిగ్రామాలపైనను, పట్టణాలపైనను జుర్మానాలు విధించబడెనో, వాటిమొత్తమెంతయో, అందెంత వసూలైనదో తెలిసికొనగోరిరి.

అందుకు అమెరీగారు తనకే పోయిన ఆగస్టు ౩౧ తేదికి తర్వాతి సమాచారము తెలియదనిరి. అంత వరకు ౧౫౫౬ ఊళ్ళపై జుర్మానాలు విధించబడినవి, వాటిమొత్తము రూ ౯౦ లక్షలు. అందులో రూ౭౮ లక్షల ౫౦ వేలు వసూలైనవి.

## కలకత్తా నగరంలో రెండు రోజులలో ౬౭ మరణాలు

కలకత్తా నగరమందును, దాని పరిసరములలోను డిసంబరు ౧౨ తేదిన క్షుత్పీడితులు ౬౦ మంది మరణించినారు. ౧౦ తేదిన హిందూసత్కార సమితివారును, అంజుమన్ మఫీదుల్ ఇస్లాంవారును కలిసి ౫౭ శవములకు సంస్కారములను చేసియుండిరి.

## ఇండియాకు క్వైనాకన్నా ముందుగా సారాయి పంపుట

డిసంబరు ౧౦ తేదిన బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో అమెరీగారిని ఒకరు ఇండియాకు ఎంతో అవసరమైన క్వైనానుపంపుటకు ఓడలలో చోటులేదనుచు విస్కీ-అనే సారాయిని ఎట్లు ఓడలో ఇండియాకు పంపించినారయ్యా అని అడుగగా, అమెరీగారు, "ఇండియాకు మద్యములను పంపించరాదను నిషేధము సెప్టెంబరునెలలో తొలగించబడెను. క్వైనా యిండియాలో తయారగుచున్నది. అక్కడవారికి క్వైనా అక్కడికి చాలియున్నది." అని చెప్పిరి.

## అమెరీగారి ఉపన్యాసము అల్లరితో ముగియుట

డిసంబరు ౧౨వ తేదిన బర్మింగుహాంలో అమెరీగారు ఉపన్యసించుచుండ సభలోనివారలు మధ్యమధ్య ఆటంకపెట్టుటవల్ల సభ అల్లరితో ముగిసెను. సభలోనిరొకరు తీర్మానము నొకదానిని ప్రతిపాదించ దలచగా, అల్లరిచేసి ఆతనిని కూర్చుండబెట్టిరి. తర్వాత సభలోనుండి మరియొకరు వేదికనెక్కి ఉపన్యసించబోగా మళ్లీకొట్లాటలుజరిగెను. అందుపై పోలీసులను ఎక్కువమందిని పిలిపించిరి. వేదికపైనున్నవారు జాతీయగీతమును; సభలోనివారు అంతర్జాతీయ గీతమునుపాడి సభను సమాప్తము చేసి పోయిరి.

## ఇండియాలో ఇదివరకే అట్లాంటిక్ చార్టర్ అమలు

### అమెరీగారివింత వివరణ

అమెరీగారు మదరాసునగరపు "హిందూ"పత్రికయొక్క లండను విలేఖరుడడిగిన ప్రశ్నలకు సమాధానమిచ్చుచు ఇట్లు సెప్పినారట,—

"మేము అట్లాంటిక్‌చార్టర్ సిద్ధాంతములను నిర్ధారణగా అమలు జరుపుచున్నాము: ఈచార్టర్ సిద్ధాంతములు మాకిదివరలోనే తెలుసును. అట్లాంటిక్ చార్టర్‌ను ఇండియాకు వర్తింపజేయుట మాయిష్టముకాదనుమాటను ఎందుకు ప్రచారము చేయుచున్నారో నాకు బోధకాలేదు. చర్చిల్, రూజ్వెల్టుగారలు కలియుటకుపూర్వము చాల ఏండ్లక్రిందటనే మేముదానిని ఆచరణజేయుటకు ప్రారంభించియుంటిమి. ౧౫ మాసములక్రింద సర్ స్టాఫర్డుక్రిప్సుగారు ఇండియాకు ఇచ్చెదమని తెలిపినదానిలో ఈచార్టర్ సిద్ధాంతముల ఆచరణయోగ్యములు. అంతకంటె సంపూర్ణమైన ఆచరణ మరొకటి నాకు గోచరముకాదు. క్రిప్సుగారి ప్రకటనలో పదాలయందు చాల చిన్నమార్పులు చేసినచో, దానినిపుడు యూరపుఖండంలో జాతులను మూడు గొప్పరాజ్యాలు జర్మనీనుండి వదలించినతర్వాత ఆజాతులకు వర్తింపచేయవచ్చును.

ఇండియాలో బ్రిటిషువారి విధానము నాడు, నేడు, రేపుకూడ అట్లాంటికుచార్టర్ సిద్ధాంతములనే అనుసరించియున్నది.

## గాంధీమిషన్ సంఘము

భిక్షునిర్మలానందగారు గాంధీమిషన్ సంఘ స్థాపకులు వారి ఆశ్రమముపేరు కృపాశ్రమము (తిరుక్కాటుజిల్లా) భిక్షుగారు హైద్రాబాదులో గాంధీమిషన్ సంఘమును స్థాపించుటకై ఈక్రింది విధముగా ప్రకటించుచున్నారు.

"ఈ గాంధీ మిషన్ సంఘము కేవలము రాజకీయేతరమైనట్టిది, మహాత్మ గాంధిగారి జీవితాదర్శములకు ప్రచారము కలిగించునట్టిది. ౧౦ ఏండ్లకుపైగా ఇది (సాంఘికవిద్యా వైద్యక సేవలను చేసినది. ప్రభుత్వమువారు దానికి కష్టములు కలిగించిరి. పైగా పూర్వాచారులున్నూ అంతరాయాలు కల్గించిరి. ఈ రెండుబాధలకును ఇది అతీతమై నిలిచినది. ఈసంఘములో జన్మము ప్రధానముగాదు. మతాలు కత్తులు జలిపించవు. "ఏకంసత్ విప్రా బహుధావదంతి" అను ప్రధానసూత్రమునే ఇది పాటించును.

ఈ దశవార్షిక సేవాఫలితముగా ఇప్పుడు సంఘముయొక్క శాఖలను స్థాపించుట అవసరమని తోచినది. దానికితగిన వాతావరణము హైద్రాబాదులో కలదని ఇందు ప్రథమశాఖను స్థాపింపదలచినాము, ఈసమితివారికి పలువురు సంస్థానవాసులను పరిచితులగుటచేతను వారు పేరుపేరుగ సంగుటచేతను తమ సేవలను ఇచ్చుటకు వారు సంసిద్ధులైనారు. కావున సమితివారు రాష్ట్రప్రజలందరిని, కులమత లింగభేదములను పాటింపకుండా సాయపడుటకై కోరుచున్నాము. ఈసమితియుద్దేశము కేవలగా

౧, మహాత్మ గాంధీగారి బోధకులను ఈక్రింది విధముగా ప్రచారముచేయుట. (అ)మాతృభాషా ద్వారా మత, పరిశ్రమాది పాఠశాలలను స్థాపించుట. (ఇ) మహాత్మగారి సందేశవ్యాప్తికై పుస్తకాలు; సంచికలు, పటాలు మున్నగునవి ముద్రించుట. (ఉ) సభలు మహాసభలు, భజనలు, పరిచారక సమితులు ఏర్పాటుచేయుట;

౨. స్త్రీల కేంద్రములు స్థాపించి వారిలో సంఘసంస్కారమును గావించుట.

౩. అవసరమగు స్థలాలలో వేళలలో వైద్య సహాయము చేయించుట.

౪ అంతరానితనము, మతసాంఘికత, మున్నగు సంఘలోపాలను ప్రతిఘటించుట ఈసంఘముయొక్క కేంద్రము హైద్రాబాదు పరిసరాలలో నుండును. ఒక ప్రబుద్ధ ప్రజాసేవకుని ఆధీనములో నుండును. దేశసేవ చేయదలచు యువకులకు అందు స్థానమిచ్చి భోజనముపెట్టి ఉచితశిక్షణ మియ్యగలరు. ఆశ్రమనియమాలకు అనుగుణ్యముగా వారు కఠినశిక్షణమునకు బద్ధులైయుండవలెను.

ప్రజలందరిసంస్థకు స్వాగతమిచ్చి తమ శక్తికొలది సహాయము చేయవలెనని ప్రార్థన.

## గోవధవిషయమై వివాదములో పఠాను మరణము

బొంబాయి,

పఠానులకును, భయ్యాలకును నిన్నసాయంకాలము అంధేరిలో ఒకగోవును బహిరంగ స్థలములో చంపెడివిషయమునవచ్చిన వివాదములో ఒకపఠాను చంపివేయబడెను, మరి అయిదుగురు పఠానులు గాయపడిరి,

రహమత్‌ఖాన్ అడంఖాన్ అనేపఠాను తన మిత్రులతోను, బంధువులతోను కలిసి ఒకగోవును వధచేయుటకై బహిరంగస్థలమునకు తీసికొనిపోయెను, కొందరుభయ్యాలు ఇదిచూచి ఆగ్రహముతో కత్తులు కటారులతోవచ్చిరి. ఇంతలో మరికొందరుపఠానులుచేరి, అందరును కొట్లాడుకొనిరి. పోలీసుఅధికారి కొందరుపోలీసులతోవచ్చి అల్లరినణచేరు. రహమత్‌ఖాన్ గాయాలతో చనిపోయెను.

## కొన్ని విదేశ విశేషములు

### ఇటలీ, స్విడ్జర్లాండుల మధ్య సరిహద్దు మూత

ఇటలీ, స్విట్జర్లాండులమధ్య సరిహద్దు మీదుగా రాకపోకలను ఈ డిసంబరు ౧౩ తేదీనుండి సాగనిచ్చేది లేదని జర్మనులు ప్రకటించినారు

### మధ్యప్రాచ్యములో చర్చిలు, రూజ్వెల్టుల సంభాషణలు

అమెరికా అధ్యక్షుడు శ్రీరూజ్వెల్టుగారు డిసంబరు ౭ తేదిన మాల్టాకుపోయిచూచిరి. వారుఇటలీలో మిత్రమండలి సేనలకు సర్వనాయకుడగు ఐసెన్‌హోవరుగారికి ఇటీవలతాము చర్చిల్, స్టాలిన్, చియాంగ్ కెషేక్ గారలతో మాట్లాడి నిర్ణయించిన తంత్రములనువివరణచేసిరి. వారు అమెరికాకు చేరుటకుముందు బ్రిటనుకుపోగలరని ఒక రూఢికాని వార్త వచ్చియున్నది.

చర్చిల్‌గారు డిసంబరు ౧౧ తేదిన కెయిరోలో యుగోస్లావియా రాజా పేటర్ గారితోను, ఇరాక్ రాజుఅమీర్లతోను సంభాషించి, ఈజిప్టురాజును కూడ దర్శించిరి.

### యుగోస్లావియా దేశభక్తసేనల ఉధృతి తగ్గుట

యుగోస్లావియాలో క్రోటు సముద్రంలో దేశభక్తుల దళములు బరోమోగ్రాడ్ నామోరుఅను దానిని ఆక్రమించినవి. సంజక్‌లో ప్రిబోజ్‌వైపు పోవుచుండిన జర్మనుసేనలు వెనుకకు తరిమివేయబడెను. తూర్పుబోస్నియాలో దేశభక్తదళములు తమమీదికివచ్చిన శత్రువును ప్రతిఘటించి పోరాడుచున్నవి,

ఒకవేలమంది స్లావ్ పనివారలు హంగరీమీదుగా యుగోస్లావియాలోకివచ్చి దేశభక్తదళములో చేరినారు.

రష్యావారు టిటోగారి ప్రభుత్వమే యుగోస్లావియాయొక్కశాసన బద్ధమైన ప్రభుత్వమని ఒప్పుకొనినారు.

### జెక్‌లకు రష్యనులకు సంధి

జెక్‌ప్రభుత్వములో రష్యను ప్రభుత్వమునకును కుదిరిన సంధిమరతులుగల పత్రముపై ఉభయపక్షముల ప్రతినిధులను డిసంబరు ౧౨ తేదినాడు సంతకములనుచేసిరి.

### బల్గేరియా జర్మనీలపై విమానాలదాడులు

బల్గేరియాలో సోఫియానగరమువద్ద యుగోస్లావియా, రుమేనియా, గ్రీసులకు మాత్రమేగాక మరికొన్ని ఇతరకొట్లకును పోవుబాటలు కలియును. ఆనగరముపై బ్రిటిషు మిత్రమండలివారి విమానాలు డిసంబరు ౧౧, ౧౨ తేదులలో బాంబులు వేసినవి.

డిసంబరు ౧౧ తేదిరాత్రి అమెరికనుల విమానాలు లండనునుండిపోయి జర్మనీలోనియెండన్‌పై బాంబులను వేసినవి. తమను తరిమివేయవచ్చిన జర్మనువిమానాలలోనుండి ౧౩౭ విమానాలను నాశనంజేసినవి,

### బల్గేరియా, తుర్కీలమధ్య జర్మను సేనలు

బల్గేరియాకును తుర్కీకిని మధ్య జర్మను సేనలు నిలువబడినట్లు ఒక సమాచారమువచ్చినది.

### అల్జీరియా ముసల్మానులకు ఎక్కువ హోదా

ఉత్తర ఆఫ్రికాలో ఏర్పడిన ఫ్రెంచిజాతీయ విమోచన సమితివారు అల్జీరియాలోనుండే వేలకొలదిమంది ముసల్మానులకు ఫ్రెంచి పౌరత్వపు హక్కులను వెంటనే యిచ్చుటకును, అక్కడి శాసనసభలలో ముసల్మాను సభ్యులసంఖ్యను హెచ్చించుటకును, అనేకమైన ప్రభుత్వోద్యోగములను వాటికిఅర్హులని నిరూపణమైన ముసల్మానులకు ఇచ్చుటకు అవకాశముండుటకును— నిర్ణయించిన జనరల్ డీగాల్ గారు డిసంబరు ౧౨వ తేదిన బ్రాడుకాస్టు ప్రకటనలో తెలిపిరి.

### ఫాసిస్టుసేనల ఉద్ధరణ

ముసోలిని జర్మనీ, ఇటలీ, జపానుల ఒడంబడికయొక్క వార్షికోత్సవ సందర్భమున కావించిన బ్రాడుకాస్టు ఉపన్యాసములో ఫాసిస్టుసేనలిపుడు ఉద్ధరించబడుచున్నవనియు, అవిమళ్లీ యుద్ధములో ఓగి పైజెప్పిన ఒడంబడికచేసికొన్నవారి సేనలతో కలిసి పోరాడి గడచిన కొద్దిమాసాలలో ఇటలీ రాజు శత్రువుకు లొంగుటచే ఇటలీకి కలిగిన అప్రతిష్ఠను తుడిచివేయగలవనిచెప్పిరి.

ఇదేరోజు జర్మనుప్రభుత్వ విదేశాంగమంత్రి బ్రాడుకాస్టుచేయుచు, నేటికిని యూరపులోను తూర్పుఆసియాలోను జర్మనీ, ఇటలీ, జపానులస్థితి కదలింపజాలనిదిగ నున్నది. పోయినఏడు జపానీయులు వేలకొలదిమైళ్ళలో తమ స్థానములను బలపరచుకొనినారు; జర్మనుసైనికులు శత్రువును యూరోపుకు దూరముగ నెట్టినారు. శత్రువులు ఇక తప్పించుకొని రాజాలరు.

